Reg. No. 757

# అభినవసరస్వతి

యను నొక మాసపత్రిక.

నాగరఖండ స్వర్ణకారవ్యవహారాది బహుగ్రంథకర్తయగు
జానపాటి పట్టాభిరామశాస్త్రిచే
ప్రచురింపఁబడుచున్నది.

జానపాడు.




సంపుటము 18 { 1926 సం॥ సెప్టెంబరు నెల. } సంచిక 6

విషయములు.



చందానిర్ణయము సంవత్సరమునకు

| | | | |
|---|---|---|---|
| ప్రధానపోషకులకు | రు 25 0 0 | సహాయులకు | రు 5 0 0 |
| పోషకులకు | రు 10 0 0 | చందాదారులకు | 3 0 0 |

Printed at the Chandrika Press, Guntur,
and published at Janapadu by the Editor, Astavadhani
Janapati Pattabhirama Sastry,
author of Nagarakhandam, Swarnakaravyavaharam
etc., etc.

## ప్రధానపోషకులు.

౧ శ్రీ శ్రీ జగద్గురు విరూపాక్ష స్వాములవారు, వెనికేపల్లి.
౨ శ్రీ శ్రీ జగద్గురు పుష్పగిరి స్వాములవారు, చినబీరవెల్లి.
3 బాకరాజు పరాంకుశరావుదేశాయిగారు. ఏడవరం.
౪ రామలింగుగారు- నెల్లుట్లపాపురసంస్థానముల మేనేజరు- నెల్లుట్ల.
౫ శ్రీ ఖుదె వ్యంకటశేషారెడ్డి రామచంద్రారెడ్డి దేశముఖుగార్లు, అల్లాదుర్గసంస్థానము.

## పోషకులు.

౧ శ్రీ శ్రీ జగద్గురు అభినవ విరూపాక్ష పీఠాధిపతులు, జామిఅగ్రహారం.
౨ ఎనమండ్ర లక్ష్మీనరసింహముగారు, మర్చెంటు, బెజవాడ.
3 రాజా వెంకటాద్రియప్పారావు, బహదరుగారు, వుయ్యూరుయెస్టేటు.
౪ రాజామంత్రిప్రగడ వెంకటహనుమంతరావు, రాఘవరావుగార్లు, లింగగిరి.
౫ తంగెడ నరసింహారావుగారు, కరణం, మోర్జంపాడు.
౬ శ్రీరామయాంబికా పుస్తకభాండాగారము, లక్ష్మీనర్సాపురము.
౭ లింగాల వెంకటరెడ్డి దేశముఖుగారు, కుందవరము
౮ చారబుడ్డి రత్నారెడ్డిపటేలుగారు, న్యాలపోగుల
౯ లింగాల సీతారామరెడ్డి బంగారెడ్డి, దేశముఖుగార్లు- నారాయణపురము
౧౦ టి. లక్ష్మణసింగుగారు, జోనగాం
౧౧ నెల్లుట్ల నరసింహారావుగారు, జోనగాం
౧౨ రంగాచార్యులుగారు, ముక్త్యారు, దేశముఖు, మనీదుపల్లె.
౧3 చేపలపల్లి కృష్ణారెడ్డిగారు, కేశవాపురము.
౧౪ జాగర్లమూడి కుప్పుస్వామినాయఁడుగారు, కారంచేడు
౧౫ పిడుపాటి వెంకటరాయశర్మగారు, కరవది
౧౬ శ్యామాపంతుల వెంకటేశ్వరరావుగారు, తహశీల్దారు, సిరిసిల్ల.
౧౭ గూడూరి వీరసాంబశివరావు సర్దేశపాండ్యాగారు, మానెకోండూరు
౧౮ తిరుమలవల్యాక్ చక్రవర్తి వరదాచార్యులఅయ్యవార్లంగారు-శాతాపురం
౧౯ కొత్వాలి వెంకటేశ్వరరావుగారు, సంగెం

---

## సహాయులు

౧ వావిళ్ళ వెంకటేశ్వరశాస్త్రిగారు, చెన్నపట్టణము.
౨ బుడంపాటి సుబ్బయ్యగారు, మర్చంట్, కాకినాడ
3 సంగెం రామారావుగారు, సంగెం
౪ పెద్దిభట్ల వీరయ్యగారు, ప్లీడరు బెజవాడ
౫ నెల్లుట్ల కేశవరావు దేశముఖుగారు, నెల్లుట్ల
౬ రంగావఝ్ఝల రంగయ్యగారు, నర్సారావుపేట

# అభినవసరస్వతి

సంపుటము ౧౮ { జానపాదు క్షయ సం॥ భాద్రపదమాసము } సంచిక ౬

## ప్రజా ప్రబోధము.

శ్రీమ దభినవసరస్వతి సంపుటము 18, సంచిక 1 లో "శాసనసభాసభ్యుల యుపకార"మను శీర్షికక్రింద నిదివరలోఁ జట్టనిర్మాణసభలకు సభ్యులుగ నేగినవారు మత విషయచర్చలు శాసనసభలలోఁదెచ్చి శాసనముల నిర్మించి తద్ద్వారమున మనమతమునకుఁ గలుగఁజేసెడి యుపకారమును దానికి మనముచేయఁదగిన ప్రతిక్రియలును నా యల్ప మతికిం దోఁచినవిధమున ముచ్చటించియున్నాఁడను. ఇపుడు రాఁబోవు నవంబరు నెలలోఁ దిరిగి శాసనసభ్యుల యెన్నికలు రానున్నవి గాన తద్విషయమై ప్రజలు కావింపవలసిన కార్యముంగూర్చి యించుక ప్రబోధింపనెంచి యీచిన్నివ్యాసమును వ్రాయుచున్నాఁడను. కాన సుజనులు గుణమును గ్రహించి దోషమును బరిత్యజింతురుగాక.

రాఁబోవు నవంబరు మాసములో "శాసనసభాసభ్యుల యెన్నికలు జరుగనున్నవి. ఆయెన్నికలలో సభ్యులుగ నిలుచుటకు "నఖిలభారత దేశీయమహాజనసభవారే" యసహాయవాదులను గొందఱిని బ్రతిజిల్లాయందును నిర్ణయించియున్నారు. వారినే ప్రజ లెన్నుకొనుటకై పత్రికాముఖమునను బ్రచారకముఖమునను బ్రచారముగావించుచున్నారు. కాంగ్రెసు తరఫువారినే సభ్యులనుగా నెన్నుకొనినందునఁ బ్రజలకుఁ గలిగెడి లాభములంగూర్చి వారిట్లు చెప్పుచున్నవారు. "ఇదివరలో శాసనసభలకు సభ్యులుగ నేగినవారిలో నెక్కుడుమంది గవర్నమెంటువారి కనుకూలముగ నడచుకొని వారిచే గౌరవముఁ బడయవలయునను నాశయముగలవా రెక్కుడుగను బ్రజానుకూలముగఁ బ్రవర్తించువారు కొలఁదిగను నుండుటచే నొకవిషయమై శాసనసభలోఁ జర్చగలిగినపుడు గవర్నమెంటు కనుకూలులగు వార "వోట్లు" యెక్కువగవచ్చుచుండెననియూ సంబు

వలనఁ బ్రజానుకూల ప్రవర్తకులకుఁగూడఁ బ్రజల క్షేమియు నుపకారము గావింప నవకాశము కలుగ లేదనియు నిపుడు శాసన సభ్యులందఱును గాంగ్రెస్ వైపువారే యైనయెడల నందఱును దేశసేవయే ప్రధానోద్దేశముగాఁగలవారై గవర్నమెంటుతోఁ బ్రతిఘటించి పనిచేయుట కవకాశముండుననియు నట్లు పనిచేసిన సత్వరముగ స్వరాజ్యముఁబడయవచ్చు ననియుఁ జెప్పుచున్నవారు. ఇదివఱలో శాసనసభలకేగినవారుకూడఁ బ్రజలవలన "వోట్లు" గ్రహించునపుడు పన్నులు తగ్గింపఁజేయుదుమనియు స్వాతంత్ర్యములఁ గల్పించెదమనియు స్వరాజ్యము సంపాదించియిచ్చెదమనియుఁ జెప్పినవారే. ఆట్లేగినతరువాత నామాటల నేటఁగలుపుటయే గాక తమకేమాత్రమును సంబంధములేనిమతవిషయములలో నైక్యముకలుగఁ జేసికొని తద్విషయమై ప్రజలకున్న స్వాతంత్ర్యమును నాశముఁజేయ సమకట్టియున్నారు. ఇపుడుపోనున్న యసహాయవాది సభ్యులు రాజకీయముల విషయమై పైవారివాలె బూటకములఁ జెప్పక ప్రజాసేవయే ముఖ్యముగఁ గైకొని గవర్నమెంటు వారితోఁ బ్రతిఘటించి పనిఁజేసి స్వరాజ్యము సంపాదించి యిచ్చెదరనియే మనము తలంచినను మతవిషయములలో మాత్రము వీరుగూడఁ బైవారివలె నైక్యము కలుగఁజేసికొనెదరని మన మూహింప నవకాశము కలుగుచున్నది. అదెట్లు? దేశీయ మహాజనసభ ( కాంగ్రెస్ ) స్వరాజ్యసంపాదనయే ముఖ్యోద్దేశముగా నిప్పటికి నలుబదివత్సరముల నుండి పనిచేయుచున్నది. కాని మత విషయముల సంస్కరించుట యీసభోద్దేశము కాదు. కాదని యీసభవారే పలుమాఱులు పలికియున్నారు.

ఇట్లుండ నీసభ నాగపురములో సమావేశమైనప్పటినుండియు నసహాయోద్యమము నవలంబించినది. తదుద్యమమునకు నాయకులు గాంధిగారు. వారు తమ యుద్యమమును "స్కూళ్ళబహిష్కారము మద్యపాన నిషేధము కోర్టుల బహిష్కారము శాసన సభాబహిష్కారము ఖద్దరు వస్త్రధారణము నస్పృశ్యతా నివారణము" నను నాఱువిధముల విభజించిరి. వీనిలో నస్పృశ్యతానివారణాంశముతక్క మిగిలినవి ప్రతిభారతీయుఁడును నంగీకరింపఁ దగినయంశములు. అవి భారతధర్మనిర్మూలన కారకములు గావు. అస్పృశ్యతానివిర్మూలనము సనాతనధర్మనిర్మూలనకరమగు నంశము. కాన నిది భారతీయుఁడగువాఁ డెవ్వఁడును నంగీకరింపఁ దగినది కాదు. ఈయంశము వారి యుద్యమమున కుపయోగకారి కాదు. అంటరానితన మడుగంటినఁగాని యైకమత్యము కుదురదని చెప్పెడిమాట బూటకపుమాట. ఏకమాతృగర్భజనితులగు నన్నదమ్ములకే యైకమత్యము లేక యొకరినొకరు దన్నుకొనుచుండ నెచటనో పుట్టి యెచటనో పెరిఁగి జాత్యంతరులగు వారికి స్పృశ్యమాత్రంబుచే నైకమత్యము కుదురుననిచెప్పెడిమాట యజ్ఞుల మోసపుచ్చుటకై

చెప్పెడి బూటకపు మాటలు గావా! ఈరీతిఁ దమయుద్యమమున కించుకంతయును నుపయోగములేని యస్పృశ్యతా నివారణము నొకభాగముగ నసహాయోద్యమ జనకులగు శ్రీ గాంధిగారు నిర్ణయించిరి. వెంటనే కొందఱు సనాతనధర్మానుయాయులు దీనివలన భారతీయులు వర్ణసంకరులగుటయే గాక తమ యుద్యమమునకుఁ గూడ భంగము వాటిల్లును గాన దీని నుపసంహరించుకొనవలసినదని యనేకవిధముల గాంధిగారికిఁ దెలిపిరి.

వారామాటలఁ జెడచెవిఁబెడి "తాఁబట్టిన కుందేటికి మూడే కాళ్ళు" ను లోకోక్తికి గురిగా నా వర్ణసంకరపుఁ దీర్మానము నుపసంహరించుకొనక మన భారతీయులవలన సంపాదించెడి ధనముతో నద్దానిని బ్రచారము గావింపఁ బ్రచారకుల నియమించినారు. ఈరీతిఁ గావించుటకుఁ గారణము వీరికి వర్ణాశ్రమధర్మనిర్మూలనమునందుఁగల సహజాసక్తియే గాని వేఱుగాదు. వీరికి వర్ణాశ్రమధర్మములందు దాసక్తియే యున్నయెడ వారి యుద్యమవిజయమున కత్యంతోపయుక్తములగు పైయంశము లాఱింటిలో స్కూళ్లబహిష్కారము సాగింపలేకపోయినను, మద్యపాన నిషేధము గావింపించలేకపోయినను ఖద్దరు వస్త్రధారణముఁ జేయింపలేకున్నను, కోర్టుల బహిష్కారము గావింపించలేకపోయినను శాసనసభాబహిష్కారము తమంతటతామే యుపసంహరించుకొనియు, వానివిషయమై ప్రచారముమాని తమయుద్యమమున కించుకంతయు నుపయోగములేని యస్పృశ్యతానివారణాంశము మాత్రము పత్రికాముఖమునను బ్రచారకముఖమునను బ్రచారముగావింతురా! కాన మన మెన్నివిధముల యోజించినను గాంధిమహాశయులు వర్ణాశ్రమధర్మములకు బద్ధశత్రులుగావుననే యస్పృశ్యతానిర్మూలనమునకై పాటుఁబడుచున్నారు గాని యైకమత్యసంపాదనకుఁ గాదనియు దీనివలన నైకమత్యము కుదురదనియుఁ దెలినది. తక్కు కాంగ్రెస్ నాయకు లందఱును వీరివాక్యమును వేదముగ భావించువారే; వార్తాపత్రికాధిపులును నట్టివారె.

కావుననే వీరందఱును నస్పృశ్యతానిర్మూలనమున కనేకవిధములఁ బాటుఁబడుచున్నారు. వీ రెన్నివిధములఁ బాటుఁబడుచున్నను వారికోరిక సిద్ధించదయ్యె. ఇట్లని వారె ప్రకటించుకొనక తప్పదయ్యెను. ఇట్టి వర్ణాశ్రమధర్మ నిర్మూలనతత్పరులగు దేశీయమహాజనసభవారిచే నిర్ణయింపఁబడినవారే యిపుడు శాసనసభాభ్యర్థులుగ నిలిచియున్నవారు. వీరు తమయిష్టపూర్తికై శాసనసభాసభ్యత్వపదవి వచ్చిన వెంటనే మున్ముందుగా నస్పృశ్యతానిర్మూలనశాసనము 'మూ' చేయక మానుదురా!

మానరు. ఇంతియే కాదు. వీరు విధవల సధవలఁ గావింపవలయుననియు రజస్వలా వివాహముల నాచరింపవలయుననియు గుణకర్మలంబట్టి జాతివ్యవస్థ గావింపవలయుననియుఁ దలంపుగల సంఘసంస్కర్తృనామధారక సంఘములోఁ జేరినవారే. అందువలన నా విషయమైకూడ వీరు జోక్యము కలుగఁ జేసికొందురనియే మనము తలంచవచ్చును. కాన మనమిపుడు శాసనసభాభ్యర్థులుగ నిలుచువారిచే "మేము రాజకీయాంశములలోఁ దప్ప మతసాంఘికవిషయమై యేవిధమైనజోక్యముఁ గలుగఁజేసికొన" మని ప్రమాణపూర్వక లేఖకపత్రము గైకొనవలయును. అందుల కిష్టములేనివారికి మన "వోటు" నియ్యఁగూడదు. అట్లు మనము గావింపమేని నిదివఱకు వారికంటె వీరెక్కుడుగ మన మతసాంఘిక విషయములలో నపకారముఁ జేయఁగలరు.

కావున నోమహాశయులారా! నిద్రనుండి మేల్కాంచి కర్తవ్యమునకై శ్రద్ధ వహింపుఁడు. ఇది నిద్రించఁదగిన సమయముగాదని ముమ్మాటికి నమ్ముఁడు. లెండు. లెండు. ఆస్తికపత్రికాధిపులారా! తాముగూడ నీవిషయమై తగినంతప్రచారము గావింపుఁడు.



సామాన్యముగా మనయందటివలె బాలగ్రహబాధలు కృష్ణునకుఁదొలఁగినవని చెప్పుటయే గ్రంథకర్త్రభిప్రాయమైన యెడల నింతవర్ణింపఁ బని లేదు- బాలగ్రహబాధలు తొలఁగకున్న నెవ్వఁడును జీవించఁడు- పూతనాదు లపుడే శ్రీకృష్ణునిచే సంహరింపఁబడినయెడల నిప్పుడు పూతనాది గ్రహశాన్తికై చేయు ఫలీకరణాదిహోమము లనవసరములను శంకయు నసంగతము- నారాయణుఁడు వరాహనృసింహావతారములతో హిరణ్యాక్ష హిరణ్యకశిపుల సంహరించినను వారు రావణకుంభకర్ణులై జన్మించి లోకుల బాధించలేదా ? రామావతారమున వారిని సంహరించినను శిశుపాలదన్తవక్త్రులై బాధించలేదా ? అటులే శ్రీకృష్ణనిహతులైనను రూపాంతరములచేఁ బూతనాదులు బాలగ్రహములై బాధింపవచ్చును. తచ్ఛాంతికై హోమములు చెప్పఁబడినవి. ఇంతమాత్రముచేఁ బరమేశ్వరమహిమలను గల్పనాకథలనుట నాస్తికవాదమగును.

6 భీముఁడు దుర్యోధనునిచే విషపానము చేయింపఁబడి నీటిలోఁ ద్రోయఁబడెను. అప్పుడు నాగకుమారు లాయనను గఱచిరి. స్థావరమగువిషము సర్పవిషముచే శమమొందెను. ఆతఁడు సర్పముల బాధింపఁగా నాసర్పములు వాసుకికడకేగి చెప్పఁగా నాయన వచ్చి భీముని గౌరవించి యష్ట కలశపరిమిత రసపానము చేయించెను. దానంజేసి భీముఁడు నాగాయుతబలుఁడాయెనని కథ వర్ణింపఁబడినది. భీముఁడు వాసుకికి దౌహిత్రదౌహిత్రుఁడనియు వర్ణింపఁబడినది. శ్లో॥ తత స్సమేత్య బహుభి స్తదా నాగై ర్మహావిషైః । అదశ్యంత భృశం భీమో మహాదంష్ట్రై ర్విషోల్బణైః ॥ గొప్పవిషముగలిగినట్టియు గొప్పకోఱలుగలిగినట్టియు నాగకుమారులచే భీముఁడు దష్టుఁడాయెనని చెప్పఁబడినది. నాగు లనునొకజాతిమనుష్యులు భీముని రక్షించిరి కాని సర

ములు రక్షింపలేదని వీరు వ్రాసిరి. అది సరికాదు. నాగు లనుమనుష్యులకు విషముండుటయు వారు నీటిలోనే నివసించుటయు నితరులం గఱచుటయుఁ బెద్దకోఱలుగలవారలై యుండుటయు నసంభవము. భీముఁడు వాసుకికి దౌహిత్రదౌహిత్రుఁడైనను గావచ్చును. అర్జునున కులూపితో వివాహము జరిగినట్లు కుంతిభోజునితండ్రికిని నాగకన్యావివాహము జరిగియుండును. నాగకన్యలు కామరూపిణులై మనుష్యుల వివాహమాడుట పూర్వయుగములలోఁ గలదు. ఇట్టికథల నిష్టమువచ్చినట్లు తాఱుమాఱుచేయుట కేవలాసంగతము.

7 అరణ్యపర్వమున మార్కండేయమహర్షి ధర్మజునకు శ్రీరామచరితమును వక్కాణించెను. రావణుని శ్రీరామచంద్రుఁడును గుంభకర్ణుని లక్ష్మణుఁడును వధించినట్లు కలదు. ఈకథ వాల్మీకిరామాయణ విరుద్ధము. ఐనను మార్కండేయుఁడు సప్తకల్పజీవియని ప్రసిద్ధి కలదు. ఒక కల్పములోని రామచరితము నాయన చెప్పియుండును. మఱియొకకల్పములోని రామచరితమును వాల్మీకిమహర్షి వర్ణించియుండును. దశావతారము లనేకపర్యాయములు వచ్చెననియు నయ్యవి కొన్ని యర్థసమములు కొన్ని పాదసమములు కొన్ని పూర్ణసమములనియు యోగవాసిష్ఠనిర్వాణప్రకరణమున భుశుండోపాఖ్యానమున వర్ణింపఁబడినది. కనుక విరోధ మేమియును లేదు. వాల్మీకిరామాయణము మార్కండేయులకుఁగాని వ్యాసులకుఁగాని తెలియదనుట యుక్తముగాదు.

ఇఁక విమర్శకులు గనఁబఱచిన ప్రశ్నలలోఁ బ్రథమప్రశ్నము చేసినవారలు భీముని శౌర్యమే దుర్యోధన విరోధమునకుఁ బ్రథమ కారణమని తలంచిరి. అది సరికాదు.

లోకమున బలాధికుఁడును విద్యాధికుఁడునగు స్వభావముచే నితరుల నరకుగొనక స్వతంత్రుఁడై యుండును. దానింజూచి యసమాన

పరు లోర్వఁజాలకుందురు. ఇది లోకవిదితము. దుర్యోధనుఁడు పరశ్రే యస్సహనము లేనివాఁడు గనుక విద్యాధికుఁడగు ధర్మజుని బలాధికుఁడగు భీముని విరోధించి రాజ్యము చేయఁదలఁచియుండెను. ఈసంగతి ధీరోద్ధతుఁడగు భీమునకుఁ దెలిసియుండును. బాలక్రీడలయందు బాల్యముచే ధార్తరాష్ట్రులకుఁ దనబలాధిక్యమును గనఁబఱచియుండును. ఇట్టిభీమునితో స్నేహముచేయుటమాని విషముఁబెట్టించి నిదురించినపుడు నీటిలోఁద్రోయుటకు దుర్యోధనుని దౌష్ట్యమే హేతువు. ఆది పర్వ॥ అ॥ ౧౨౮, ఏవం స ధార్తరాష్ట్రాంశ్చ స్పర్ధమానో వృకోదరః అప్రియేఽతిష్ఠదత్యంతం బాల్యాన్నద్రోహచేతసా॥ ఈవిధమున వృకోదరుఁడు బాల్యముచే దుర్యోధనాదుల కప్రియమాచరించెనుగాని ద్రోహబుద్ధిచేతఁ గాదని భారతమునఁగలదు. ద్రోహబుద్ధిచేతనే యహితమాచరించెనని వీరువ్రాయుట యసంగతము. ఆయధ్యాయముననే, తస్య ధర్మాదపేతస్య పాపాని పరిపశ్యతః, మోహాదైశ్వర్యలోభాచ్చ పాపా మతి రజాయత, అయం బలవతాం శ్రేష్ఠః కుంతీపుత్రో వృకోదరః, మధ్యమః పాండుపుత్రాణాం నికృత్యా సన్నిగృహ్యతాం, ప్రాణవాన్ విక్రమీ చైవ శౌర్యేణ మహతాన్వితః, స్పర్ధతేచాపి సహితా నస్మా నేకో వృకోదరః, తంతు సుప్తం పురోద్యానే గంగాయాం ప్రక్షిపామహే అథ తస్మా దవరజం శ్రేష్ఠంచాపి యుధిష్ఠిరం, ప్రసహ్య బంధనే బధ్వా ప్రశాసిష్యే వసుంధరాం॥ ధర్మవిముఖుఁడును బాపబుద్ధియు నగు దుర్యోధనుఁడు రాజ్యలోభమున భీముని గంగలోఁ బడఁద్రోయవలయుననియు ధర్మజాదుల బంధించి రాజ్యము చేయవలయుననియు సంకల్పించెనని వీనియర్థము. దుర్యోధనుఁడు సధర్ముఁడైనయెడలఁ దనకు ద్రోహ మాచరించు భీమునిపై ద్వేషించినను శాంతస్వభావులును నిరపకారులు నగు ధర్మజాదుల బంధించవలెనని యేలసంకల్పించవలెను. ప్రమదుఁడర్జునునిచే నవమానింపఁబడినను నగు

నుసితో సంబంధముచేసి మైత్రిని సంపాదించుకొనలేదా? కాన సుయోధనుని యసహనమే పాండవులపై ద్వేషమునకుఁ బ్రథమకారణము. భీమదౌష్ట్యము కాదు. దుర్యోధనుఁడు కర్ణాదులనువలె భీముని గౌరవించినయెడల భీముఁడు తనప్రాణములనైన వారి కిచ్చెడివాఁడు. ఏకచక్రపురమున బ్రాహ్మణపుత్రరక్షణమునకై బకుని వధించలేదా? పూర్వోత్తరగ్రంథముల విమర్శించినయెడల దుర్యోధనాసహనమే వైరమునకుఁ బ్రథమకారణమని తేలును.

ద్వితీయప్రశ్నము చేసినవారలు పాండవోత్పత్తిచరితము హాస్తినపురవాసులకుఁ దెలియదుగనుకనే వీరు పాండుసుతు లగుదురో కారో యని కొందఱు సంశయించిరని వ్రాసిరి. అది సరికాదు.

పాండురాజు మృతుఁడైనపుడు శతశృంగగిరినివాసులగు తాపసులు పాండవులను గుంతిని మాద్రీపాండురాజుల శరీరములను (అనఁగా శల్యములను) దీసికొని హాస్తినపురమునకువచ్చి ద్వారపాలునిద్వారమున రాజునకు వర్తమానముపంపిరి. అపుడు హాస్తినపురవాసు లందఱును ధృతరాష్ట్రభీష్మవిదురాదులును సత్యవత్యాదిరాజమాతలును నగరువెలుపలికివచ్చి యొకస్థలమున సభగాఁ గూర్చుండిరి. అప్పు డామహర్షులకు భీష్ముఁడు పూజగావించెను. సభ నిశ్శబ్దముగానుండఁగా వారిలో నొకమహర్షి తమవారి యనుమతిగొని 'పాండుమహారాజు బ్రహ్మచర్యవ్రతమవలంబించి శతశృంగపర్వతమునకు వచ్చెను; దేవతారహస్యమువలనఁ గుంతియందు యమధర్మరాజువలన ధర్మజుఁడును వాయుదేవునివలన భీముఁడును మహేంద్రునివలన నర్జునుఁడును నశ్వినీదేవతలవలన మాద్రియందు నకులసహదేవులును గలిగిరి;- ధర్మనిత్యుఁడగు పాండురాజువలన రాజవంశ ముద్ధరింపఁబడినది; పాండురాజు పదియేడుదినములక్రిందఁ బరలోకగతుఁడాయెను; మాద్రి పాండురాజుతో సహగమనముచేసెను; కుంతిని బాండవులను బాండుమాద్రుల

శరీరములను మీకొప్పగించుచున్నాము; ఉత్తరతంత్రమును మీరు నడుపుకొనవలసిన' దని చెప్పెను. అప్పు డామహర్షు లంతర్ధానమందిరి. అపుడు ధృతరాష్ట్రుఁడు విదురునితోఁ బాండుమహారాజునకు సకలప్రేత కృత్యములను యథావిధిగా జరిపించుమనియుఁ గుంతి నంతఃపురములోఁ జేర్చి యాదరించవలసినదనియుఁ బాండుమహారాజునకు దేవతుల్యులగు నయిదుగురు కొమారులుకలరు, కావున నాయనవిషయమై మనము చింతింపఁ బనిలేదనియు సెలవిచ్చెను. ఈకథ యాదిపర్వము, అధ్యా ౧౨౬ నఁగలదు. ఈవిధముగా మహర్షులు చెప్పినపుడు వీరు పాండుసుతులుగారనిగాని గూఢోత్పన్నులుగనుకఁ గులీనులుకారనిగాని యెవ్వరును నాక్షేపించియుండలేదు. అర్ధరాజ్యము నపహరించెదరను భీతితో ధృతరాష్ట్రుఁడైన నిట్టిదోషముల నారోపించవలసియుండెను. ఆయనయు నాక్షేపించలేదు. ఇటులఁ బాండవోత్పత్తి సర్వజనసంప్రతిపన్నమై యుండఁగా నాకాలమువారికి వారియుత్పత్తి శిష్టసమ్మతము కాదనివ్రాయుట కేవల మసంగతము. వీరు పాండుమహారాజుకుమారులగుదురా కారాయని కొందఱజ్ఞులు సంశయించిన సంశయించియుందురు. సీతా పాతివ్రత్యమునకు రజకుఁడు సంశయింపలేదా? గనుక నదియకించిత్కరము. ఈసంగతి దెలుపుట కాయధ్యాయమునిచటఁ బొందుపఱచుచున్నాను. ఆదిపర్వ॥ అధ్యాయము ౧౨౭ శ్లో॥ పాండో రుపరమం దృష్ట్వా దేవకల్పా మహర్షయః తతో మన్త్రవిదస్సర్వే మంత్రయాం చక్రిమిరేథః ॥తాపసా ఊచుః॥ అస్మిన్ స్థానే తపస్తప్త్వా తాపసాన్ శరణంగతః సజాతమాత్రాన్పుత్రాంశ్చ దారాంశ్చ భవతామిహ। ప్రదాయోపనిధింరాజా పాండుస్స్వర్గ మితోగతః, తస్యేమా నాత్మజాన్దేహం భార్యాంచ సుమహాత్మనః స్వరాష్ట్రంగృహ్యాగచ్ఛామో ధర్మ ఏషహి న స్స్మృతః॥ వైశంపాయన ఉవాచ॥ తే పరస్పర మామన్త్ర్య దేవకల్పా మహర్షయః పాండోఃపుత్రా న్పురస్కృత్య నగరం గజసాహ్వ

యం। ఉదారమనసస్సిద్ధా గమనే చక్రిరేమతిం॥ భీష్మాయ పాండవాౕ దాతుం ధృతరాష్ట్రాయచైవహి। తస్మిన్నేవ క్షణే సర్వే తా నాదాయ ప్రతస్థిరే పాండోర్దారాంశ్చ పుత్రాంశ్చ శరీరే తేచ తాపసాః సుఖినీ సా పురాభూత్వా సతతం పుత్రవత్సలా। ప్రసన్నా దీర్ఘమధ్వానం సంక్షిప్తం తదమన్యత॥ సా త్వదీర్ఘేణ కాలేన సంప్రాప్తా కురుజాంగలం, వర్ధమానపురద్వారమాససాద యశస్వినీ। ద్వారిణం తాపసా ఊచూ రాజానంచ ప్రకాశయ। తేతు గత్వా క్షణేనైవ సభాయాం వినివేదితాః॥ తం చారణసహస్రాణాం మునీనా మాగమంతదా। శ్రుత్వా నాగపురే నృణాం విస్మయస్సమపద్యత। ముహూర్తోదిత ఆదిత్యే సర్వే బాలపురస్సరాః। సదారాస్తాపసాన్ద్రష్టుం నిర్యయుః పురవాసినః। స్త్రీసంఘాః క్షత్ర సంఘాశ్చ యానసంఘ సమాస్థితాః। బ్రాహ్మణైస్సహ నిర్జగ్ముర్బ్రాహ్మణానాంచ యోషితః। తథా విట్ఛూద్రసంఘానాం మహాన్వ్యతికరో భవత్। నకశ్చి దకరో దీర్ష్యా మభవ న్ధర్మబుద్ధయః। తథా భీష్మ శ్శాంతనవ స్సోమదత్తో ఽథ బాహ్లీకః। ప్రజ్ఞాచక్షుశ్చ రాజర్షిః క్షత్తాచ విదుర స్స్వయం॥ సాచ సత్యవతీ దేవీ కౌసల్యాచ యశస్వినీ। రాజదారైః పరివృతా గాంధారీచాపి నిర్యయౌ। ధృతరాష్ట్రస్య దాయాదా దుర్యోధన పురోగమాః। భూషితా భూషణైశ్చిత్రై శ్శతసంఖ్యా వినిర్యయుః। తాన్మహర్షిగణా న్దృష్ట్వా శిరోభి రభివాద్యచ। ఉపోపవివిశు స్సర్వే కౌరవ్యా స్సపురోహితాః। తథైవశిరసా భూమా వభివాద్య ప్రణమ్యచ। ఉపోపవివిశు స్సర్వే పౌరజానపదా అపి। తమకూజ మభిజ్ఞాయ జనౌఘం సర్వశ స్తదా। పూజయిత్వా యథా న్యాయ్యం పాద్యేనార్ఘ్యేణచ ప్రభో। భీష్మో రాజ్యంచ రాష్ట్రంచ మహర్షిభ్యో న్యవేదయత్। తేషా మథో వృద్ధతమః ప్రత్యుత్థాయ జటాజినీ। ఋషీణాం మతమాజ్ఞాయ మహర్షి రిదమబ్రవీత్। యస్స కౌరవదాయాదః పాండుర్నామ నరాధిపః కామభోగా

కుంతీచ సత్కారం కుర్యాన్మాద్రాశ్చ స్తథాకురు ॥ యథా న వాయు ర్నాదిత్యః పశ్యేతాం తాం సుసంవృతాం ॥ నశోచ్యః పాండు రనఘః ప్రశస్య స్స నరాధిపః । యస్య పంచసుతా వీరా జాతా స్సురసుతోపమాః॥ ఇత్యాది ॥

మూఁడవప్రశ్న చేసినవారలు భీష్మద్రోణాదులు గూఢోత్పన్నులు గనుకఁ దమవలె గూఢోత్పన్నులగు పాండవులఁ బ్రేమించి కులీనులగు దుర్యోధనాదులపై ద్వేషించిరని యభిప్రాయ పడిరి; అది సరికాదు.

ఆదిపర్వము, అధ్యాయము ౧౧౦॥ శ్లో॥ ధృతరాష్ట్ర స్త్వచక్షుస్త్వా ద్రాజ్యం నప్రత్యపద్యత పారశవత్వా ద్విదురో రాజా పాండు ర్బభూవహ॥ ధృతరాష్ట్రుఁ డంధుఁడైనందున రాజ్యాభిషిక్తుఁడు కాలేదు. విదురుఁడు శూద్రయోనిజుఁడైనందున రాజ్యాభిషిక్తుఁడు కాలేదు. ఏ దోషములు లేని పాండుమహారాజు పట్టాభిషిక్తుఁడాయెనని చెప్పఁబడి యున్నందునఁ బాండుమహారాజే రాజ్యాభిషిక్తుఁడాయెను. ఆయన విరక్తుఁడై వనవాసము చేసినప్పు డగతికముగా ధృతరాష్ట్రుఁడే రాజ్యతంత్రమును జూచుచుండెను. పాండురాజసుతులు రాజ్యార్హులై ధార్మికులని ఖ్యాతిగాంచియుండఁగా వారిపై ద్వేషించుటయే గాక విషప్రదాన జలపాతన లాక్షాగృహదాహ కపటద్యూతాది మూలముగా బాధించుచు నెందఱు చెప్పినను వినకుండుటం జేసి భీష్మద్రోణాదు లనేల ధృతరాష్ట్రగాంధారులకుఁగూడ దుర్యోధనునిపై ద్వేషము కలిగినది. భవితవ్యతవలనను బుత్రప్రేమాధిక్యమువలనను ధృతరాష్ట్రుఁ డాతనిపక్షము వదలలేకపోయెను. ఆదిపర్వము, అధ్యాయము ౨౦౮॥ శ్లో॥ యథైవ పాండోస్తే వీరాః కుంతీపుత్రా మహారథాః। తథైవ ధర్మతస్సర్వే మమపుత్రా నసంశయః । యథైవ మమ పుత్రాణా మిదంరాజ్యం విధీయతే। తథైవపాండుపుత్రాణా మిదం రాజ్యం

స్పరిత్యజ్య శతశృంగ మితో గతః। బ్రహ్మచర్య వ్రతస్థస్య తస్య దివ్యేన హేతునా॥ సాక్షాద్ధర్మా దయం పుత్రః తత్రజాతో యుధిష్ఠిరః తథైనం బలినాం శ్రేష్ఠం తస్య రాజ్ఞో మహాత్మనః। మాతరిశ్వా దదౌ పుత్రం భీమంనామ మహాబలం, పురుహూతా దయం జజ్ఞే కుంత్యామేవ ధనంజయః। యస్య కీర్తి ర్మహేష్వాసాన్ సర్వా నభి భవిష్యతి। యౌతు మాద్రీ మహేష్వాసా వసూత పురుషోత్తమౌ। అశ్విభ్యాం పురుష వ్యాఘ్రా విమౌ తావపి పశ్యత। చరతా ధర్మనిత్యేన వనవాసం యశస్వినా। నష్టః పైతామహో వంశః పాండునా పునరుద్ధృతః। పుత్రాణాంజన్మవృద్ధించ వైదికాధ్యయనానిచ। పశ్యంతస్సతతం పాండోః పరాం ప్రీతి ముపావహన్నృప। వర్తమానస్సతాం వృత్తే పుత్రలాభ మవాప్యచ। పితృలోకంగతః పాండు రిత స్సప్తదశే హాని॥ తం చితాగత మాజ్ఞాయ వైశ్వానరముఖే హుతం। ప్రవిష్టా పావకం మాద్రీ హిత్వా జీవిత మాత్మనః। సా గతా సహ తేనైవ పతి లోక మనువ్రతా। తస్యా స్తస్యచ యత్కార్యం క్రియతాం తదనం తరం। ఇమే తయోశ్శరీరే ద్వే పుత్రాశ్చేమే తయోర్వరాః। క్రియాభి రనుగృహ్యంతాం సహమాత్రా పరంతపాః। ప్రేతకార్యే నివృత్తేతు పితృమేధం మహాయశాః। లభతాం సర్వధర్మజ్ఞః పాండుః కురుకులో ద్వహః॥ వైశంపాయనఉవాచ - ఏవముక్త్వా కురూన్ సర్వాన్ కురూణా మేవ పశ్యతాం। క్షణేనాంతర్హితా స్సర్వే తాపసా గుహ్యకైస్సహ। గన్ధర్వనగరాకారం తత్రైవాన్తర్హితంపునః। ఋషిసిద్ధగణాన్దృష్ట్వా విస్మ యం తే పరం యయుః॥ ధృతరాష్ట్ర ఉవాచ॥ పాండో ర్విదుర సర్వాణి ప్రేతకార్యాణి కారయ। రాజవ ద్రాజసింహస్య మాద్ర్యా శ్చైవవి శేషతః। పశూ న్వాసాంసి రత్నాని ధనాని వివిధానిచ, పాండోః ప్రయచ్ఛ మాద్ర్యాశ్చ యేభ్యోయావచ్చ వాంఛితం। యథా

తావలంబులగు భక్తులయొక్క కాని సిద్ధాంతులయొక్క కాని కదుర్హా లోపమువలనఁ గలిగినది కాదు. ఈలోపమంతయు శాస్త్రవిధిం ద్యజించి యిష్టమువచ్చినట్లు సనాతనమతస్థుల దొంగలనియు వంచకులనియుఁ దెగవ్రాసిన వివేకానందునిదేకాని యన్యముకాదు.

పంచముల స్థితినిగూర్చి కరవీరపీఠాధిపతులగు జగద్గురుశంకరాచార్యులవారుకూడ నేమో వ్రాసిరఁట. అదియుఁజాతము-

"ఆత్మోపలబ్ధికిఁ బ్రియత్నించని లౌకికుఁడు మతాంతరులగు ముసల్మానులను, క్రైస్తవులను ప్రేమించి గౌరవించి హిందువులగు పంచములకు దూరముగాఁబోయి హేయముగాఁజూచుపక్షమున ఘోర పాపముఁ జేయుచున్నాఁడని నాయభిప్రాయము. ఉత్తమమగుపరిశుద్ధత నిఖిల భూతములనుఁ బ్రేమించుటవలన గలుగునని మఱువరాదు. ఇప్పటి కైనను అగ్రజాతి హిందువులు పంచములు తమసోదరులని గ్రహించు టవసరము."

ముసల్మానులును క్రైస్తవులును మతాంతరస్థులే కాదు; దేశాంతరస్థులుఁగూడ. వారిదేశములకు మనము పోఁగూడదనికూడ స్మృతులు చెప్పుచున్నవి. మనధర్మశాస్త్రములు మనదేశమువారికి సంబంధించినవే కాని యన్యదేశస్థులకు సంబంధించినవి కావు. అందువలన నన్యదేశస్థుల నంటవచ్చునని కాని కూడదని కాని తెలుచు నిర్దేశించి యుండలేదు. ఉండకున్నను వారు పంచములవలెఁ డి సహపంక్తిభోజనాది సంబంధము గలిగి యుండుటవలన వారినిగూడ మనము కొంచెమించు మంచివారినిగానే చూచుచుంటిమి. అంతియేకాని వారిని బ్రేమించుటయు లేదు. గౌరవించుటయు లేదు. సభ్యస్త్రహాణవిద్యలై సంఘసంస్కారుల మనుకొనువార లెవరో కొందఱు ప్రేమగౌరవములు చూపినను నది సర్వ సామాన్యము గాదు. అయోమార్గాదులయందును న్యాయస్థానముల

యందును దత్సంసర్గమున కొప్పుకొనుమం ప్రేమగౌరవములు చూపుట లేదాయనిన నవి యధికారము నెడలం జూపునవి కాని వారివి కావు. పంచముల ధర్మశాస్త్రప్రకార మంటుటలేదు కాని హేయముగాంజూచుట లేదు. అంటకుండినంత మాత్రముననే వారిని హేయముగాంజూచినట్లైన మన యాండువాండ్రు రజస్వలలైయున్నపుడు వారిని, జాతాశౌచ మృతాశౌచసమన్వితులగు సమీపబంధువులనుగూడ నంటము. అపుడు వారినిగూడ హేయముగాం జూచినట్లే.

ఇంతయేల. మడిగట్టుకొన్నప్పుడు కట్టుకొనని పుత్రకళత్రాదులం గూడ నంటనీయము. వీరందఱును హేయతాస్పదులే కావచ్చును. అట్టు లంటనిచ్చుటయే ఘోరపాతకము కాని యంటనీయకుండుట యెప్పటికిని గానేరదు. నిఖిలభూతములను బ్రేమించుటవలనం గలుగునది యంతః పరిశుద్ధత కాని బాహ్యపరిశుద్ధత కాదు. అది స్వర్ణాదులు వర్జించుట వలనం గలుగవలసినది. ఇంకను స్వాములవారిచే "నగ్రజాతిహిందువులు పంచముల తమసోదరులని గ్రహించు టవసర"మని చెప్పంబడియేం గాని యస్మన్మత మదికాదు. శ్లో॥ ఆత్మవత్సర్వభూతాని యః పశ్యతి సపశ్యతి" యను నార్యోక్తి ప్రకారము సర్వభూతములను నాత్మసమానముగాం జూచువాండే యాత్మనుజూచువాండని మాయభిప్రాయము. ఈస్వాముల వారు కరవీరపీఠాధిపతులనియు జగద్గురు శంకరాచార్యులనియు మన వారు పేర్కొనియున్నవారు కాని యదియసత్యము. శృంగగిరి పుష్పగిరి విరూపాక్షాది పీఠములవలె శంఖేశ్వరపీఠమని పశ్చిమదేశమునం దొక గురుపీఠముండెడిని. దానినే కరవీరపీఠమనికూడ ననుటగలదు. తత్పీఠాధిపతులు వ్యాధిగ్రస్తులై మరణశంకచే హూణాంగ్లసాంకోపిదులగు నొకరిని మంత్రోపదేశపూర్వకముగా సన్యసింపంజేసిరి ని పిదుపకి తమరు మరల జీవించియే యుండిరి. అయినను శిష్యులంగూడం గొంతదేశము

సంచరించుచు నాచారవ్యవస్థ చేయుటకుఁ బంపియుండిరి. ఆపీఠమునకుఁ గొల్హాపుర రాజ్యమునను బరోడా రాజ్యమునను భూములుగలవు. తదుభయ దేశాధిపతులును బ్రహ్మద్వేషులు. సంఘసంస్కర్తలమనుకొనువారు. హూణభాషావిదులు. అందువలన హూణభాషాభిజ్ఞులగు చిన్నస్వాములవారితోడి మైత్రి నెఱపి మెల్లగా వారినిగూడ నవనాగరిక మతమునకు లాగిరి. రాకున్న నగ్రహారముల హరింతుమని భయపెట్టిరి. అందువలనఁ దత్స్వాములవారు తదాజ్ఞాబద్ధులై తద్దేశమునఁదదనుకూలమైన యాచారవ్యవస్థచేయ మొదలిడుటయు శిష్యు లనేకులు తిరుగఁబడి పెద్దస్వాములవారికిఁ జెప్పుకొనిరి. వారు వీరికిఁ బూజానమస్కారములు చేయఁగూడదని శాసించిరి.

ఈస్వాములవా రాస్వాములవారికి శిష్యులో ప్రశిష్యులో యగుందురు. అయినను వీరియోగ్యత శ్లాఘ్యతమము. దేశాధినాధులుమున్నగు స్వల్పసంఖ్యాకులకుం దప్ప మిగిలిన దేశవాసిజనుల కనేకుల కనభిప్రేతమైన యీయాచార్యత్వమును నీయగ్రహారాదులును నాకేలయనియన్నియుఁ బెద్దస్వాములవారికే యర్పించి తా మీరీతి దేశనాయకులలోఁ గలసి దేశోద్ధారణమునకై పాటుబడుచున్నవారు. కావున నిట్టిస్వాములవారియుక్తి యెంతవిశ్వాస్యమో వేఱ చెప్పనవసరము లేదు. ఇఁక గీతారహస్యగ్రంథకర్తయుఁ దత్త్వవేత్తయు నసమానపండితుఁడును రాజకీయవ్యవహార ధురంధరుఁడును నగు బాలగంగాధరతిలకు మహారాజు మాటలను వింటిము. 1894 వ సం॥ గణపతియుత్సవములో మాదిగవాఁడొకఁడు తన గణపతివిగ్రహమును దీసికొనివచ్చెనఁట. వాని నుత్సవములో నెవ్వరును జేరనీయలేదఁట. అతఁడు తనతోవచ్చి చెప్పుకొనెనఁట, తానుపెట్టుకొన్న బండిలోఁ బెట్టుకొమ్మని చెప్పి పెట్టించెనఁట. పెట్టించుఁగాక! భగవంతున కెవఁడంటరానివాఁడు కాఁడో వాఁడంటరానివాఁడనుట భగవంతునియెడ నపచారముచేయుటయఁట. ఇట్లని పెద్ద

దోష మొకటి చూపుచున్నవాఁడు. భగవంతున కెవఁడును నంటరాని వాఁడు లేఁడనికదా యీయనయభిప్రాయము! భగవంతుఁడు సర్వాంతర్యామియనియు నీభేద మంగములదికాని యాత్మలదికాదనియు మేము నెఱుంగుదుము. బ్రాహ్మణదేహమే చండాలదేహము నంటఁగూడదనుచుంటిమి కాని వీనియాత్మ వానియాత్మ నంటఁగూడదనియను ముండలేదు. వాఁడు వీఁడు నను వ్యవహార మున్నంతవఱకు నంటరానితనము వెంట నంటునదియే. ఇవి పై మెట్టుమీఁదిమాటలు. చండాలుఁ డంటరాని వాఁడని స్మృతిచెప్పుచున్నది. అది భగవదాజ్ఞ. అట్టిభగవదాజ్ఞకు మనము బద్ధులమైయుండవలె. ఉండకున్న భగవద్ద్రోహుల మగుదుము. చూడుఁడు! మహాభారతము, ఆశ్వమేధికపర్వము శ్లో॥ శ్రుతి స్మృతీ మమైవాజ్ఞా యస్తా ముల్లంఘ్య వర్తతే। ఆజ్ఞాచ్ఛేదీ మమద్రోహీ మద్భక్తోపి న వైష్ణవః॥ శ్రుతియు స్మృతియు మదాజ్ఞారూపములనియు వాని నుల్లంఘించు వాఁ డాజ్ఞాచ్ఛేదియు నస్మద్ద్రోహియు నగుననియు మద్భక్తుఁడైనను గాఁడనియు నీశ్లోకముచే భగవంతుఁడు చెప్పియున్నవాఁడు.

దీనినిబట్టి యితఁ డంటరానివాఁడనుటకాదు భగవంతునియెడ నపచారముచేయుట యంటరానితన మనుగంటింపఁజూచుటయే. భారతదేశ స్వాతంత్ర్యమునకుఁగాఁ బాటుబడినవారిలోఁ బ్రథమగణ్యుఁడగుటవలన బాలగంగాధరతిలకుగారు లోకమాన్యులగుటయే కాక మనవారిచే మహారాజశబ్దవాచ్యుఁడగుటయు మహాసంతోషకరము. గీతారహస్యగ్రంథకర్తయగు తన్మహామహుని తత్త్వవేత్తృత్వము దగ్గరమాత్రము తగవు లేకయుండలేదు. అసమానపండితుఁడనుట యంతకన్న ననాలోచితము. నిమ్నజాత్యుద్ధరణసంఘమువారు పేర్కొనిన ధర్మనిర్ణేతలలో లాలా లజపతిరాయిగారుకూడ నొక్కరు. నిమ్నజాతులవారి కొకస్థానము లేదనియు నిపుడున్నస్థితిలో నున్నంతమట్టుకు దేశములో నైకమత్యము కుదు

రదనియు వార లుచితస్థాన మాక్రమించునంతవఱకు నిజముగా మన మొకజాతియని యనుకొనుటకు వీలు లేదనియు మన మొకజాతిగా నిర్ణయింపఁబడుటకుఁ గావలసిన సమర్థత వారిసాయము లేక సమకూరదనియు నన్నికులములజనులును సమర్థులగునంతవఱకు జాతి యేర్పడదనియు నీయన బోధించుచున్నవాఁడు. ఈబోధసారము సమస్తజనులును సమస్త విషయములలోనను సమానులయియే యుండవలెనని తేలుచున్నది. ఇయ్యది పరమోత్తమమైన బోధ. ఇందువలననే యీయన దేశబంధు బిరుదము సార్థకమయ్యెడిని. కాని యిది సిద్ధించుటయే దుర్ఘటము. మొదలు భరతఖండవాసులగు సమస్తజనులు నింతమందియని లెక్కించి పిదప వారికుండిన స్థిరచరరూపమైనయాస్తి యావత్తును సందఱికిని సమానముగాఁ బంచినప్పుడుకదా నిమ్నజాతులు పైకివచ్చియు నగ్రజాతులు క్రిందికిదిగియు నందఱును సమానులగుట! ఒకవేళ ధనద్రవ్యాదులనట్లుపంచఁగలిగినను నదృష్టమును దెలివి తేటలనుబంచుటకు బ్రహ్మావశముగాదు. అది కర్మవశమే. కనుకనే యిది కానిపని. బరోడామహారాజుగా రంటరానితనమేమిటనియు విచిత్రమగు నీయాచార మొక్క హిందూ దేశములో మాత్రమే కనఁబడుచున్నది కాని యితరదేశము వారికిదీనియర్థము బోధపడదనియు వ్రాసియున్నవారు. ఆయన వ్రాసినదంతయుయథార్థమే.

శ్లో॥ ఆర్యావర్తః పుణ్యభూమి ర్మధ్యం వింధ్యహిమాగయోః॥

అను నమరసింహోక్తిప్రకారము హిమవద్వింధ్యపర్వతములకు రెండింటికిని నడుమనుండిన భూమియంతయు నార్యావర్తమను పేరఁ బుణ్యభూమియై యున్నయది. "చాతుర్వర్ణ్యవ్యవస్థానం యస్మిన్ దేశే నవర్తతే, మ్లేచ్ఛదేశ స్స విజ్ఞేయో హ్యార్యావర్తా దనంతర' మ్మను శ్లోకముచేఁ జాతుర్వర్ణ్యవ్యవస్థానము లేక యార్యావర్తమున కవతలనుండెడి దేశమంతయు మ్లేచ్ఛదేశమని దీని కనుగుణముగనే విష్ణుస్మృతికూడఁ జెప్పుచున్నది. కావున వర్ణవ్యవస్థయే లేని హూణమ్లేచ్ఛదేశములలో నంట

రానితనము లేకుంటయే నిజముకాని యాయాచారమున సేవగించు కొను బుద్ధిమంతు లందఱును నక్కడనే పుట్టవలసినవారు. పూర్వజన్మ మందలి పుణ్యలేశముచేఁ బుణ్యభూమిం బుట్టిరి. పుట్టినదోషమున మొట్ట మొదటినుండియు నున్న దేశాచారమున సేవగించుకొనిన నేమిలాభము కలిగెడిని? దేశాచారముఁ మార్పఁగూడదని స్మృతికర్తలగుఋషులెంద ఱెట్లుచెప్పిరో తిలకింపుఁడు. దేవలః-శ్లో॥ ఆదావేవ హ్యదేశధర్మో విచింత్యో దేశేదేశే యా స్థితి స్సైవ కార్యా లోకద్విష్టం పండితా వర్జయంతి, దైవ జ్ఞోత్రో లోకమార్గేణయాయాత్॥ మొట్టమొదలు దేశాచారమేయాలో చింపవలసినది. ఏదేశమం దేస్థితియో యదియే కార్యము. లోకవిరుద్ధము ను బండితులు వివర్జింతురు. కాఁబట్టి యాస్తికుఁడు లోకమార్గమున నడ చునది. శ్లో॥ యేషుదేశేషు యేదేవాః యేషుదేశేషు యేద్విజాః। యేషుదేశే షుయచ్ఛౌచంయాశ్చ యత్రైవ మృత్తికాః। యేషుదేశేషు యత్తోయం ధర్మాచారశ్చయాదృశః॥ తత్ర తా న్నావమన్యేత ధర్మస్తత్రైవ తాదృ శః॥ [యేదేశములయం దెవ్వరు దేవతలో యేదేశములయం దెవ్వరు బ్రాహ్మ ణులో యేదేశములయం దేది శుచిత్వమో యేదేశములయం దేది పానీ యమో యెట్టియాచారమో యచట వాని నవమానింపఁదగదు. అక్కడ నట్టిదే ధర్మము] యాజ్ఞవల్క్యః- శ్లో॥ యస్మిన్ దేశే య ఆచారో వ్యవ హారః కులస్థితిః। తథైవ పరిపాల్యోసౌ యథావశముపాగతః॥ (ఆచార మును వ్యవహారమును గులస్థితియును నేదేశమున నెవ్వియుండునో యవ్వి యట్లే పరిపాలింపఁదగినవి.)

స్మృత్యంతరేచ. శ్లో॥ ఇతరస్మిన్ స్వకం ధర్మం దేశే కుర్యా ద్ద్వి దేశికః కుర్వన్ ధర్మంతు తత్రత్యం తద్గత స్తత్రదుష్యతి॥ (ఇతర దేశమున కేగినపుడును స్వధర్మమునే యాచరింపవలయును. అట్లుకాక యచటి ధర్మమునే యాచరించినట్లైన దోషియగును. (ఇంతయేటికి. ఎరరు తమ

దేశాచారములవదలిపెట్టిరో యొకటి విచారించుదము. చిరకాలము క్రిందనే మనదేశమును గొట్టి కోలాహలముచేసి స్వాధీనపఱచుకొని మనదేశమునఁ బ్రవేశించిన మ్లేచ్ఛులును దమయాచారములఁగాని దైవతములఁగాని విడిచియుండలేదు. ప్రస్తుతము మనదేశ మాక్రమించి ప్రభుత్వముసేయుచున్న హూణులును దమదేశాచారముల నించుకంతయైనను మార్చుకొనఁజూచుటలేదు. ఏదుర్బుద్ధులుపుట్టినను మనదేశస్థులకే పుట్టుచున్నవి. ఒకచెంప మహమ్మదీయులలోఁగలయువారునునొకచెంపఁ గ్రైస్తవులలోఁగలయువారును నందఱును మనవారే. ఈకలయుటకుఁగల కారణము బుద్ధిశూన్యతయనిగుర్తెఱుంగక యెక్కువజాతిపైఁబడి యేడువ మొదలిడిరి. అగ్రజాతిజను లధమజాతిజనుల నంటనీయక యభాగ్యులఁ జేసి యణఁగఁ ద్రొక్కుటయే యన్యమతప్రవిష్టతకుఁ గారణమైన నెక్కువజాతివార లితరమతములఁ జేరుచుండుటకుఁగల హేతు వేమైయుండెడిని? ఎంతమంది యిదివఱకుఁ బ్రవేశించిరి ? ప్రవేశించుచున్నారు ? ప్రవేశింపఁగలరు? కనుక నిదియంతయు మన యుక్తాయుక్తజ్ఞానశూన్యతయేకాని మఱియొకటికాదు. తురకలనుజూచి లాగులును నంగరఖాలును సేర్వానీలునుగుచ్చుకుళ్ళాయిలును, హూణులఁజూచి బూట్లును సూట్లును గోట్లును బంట్లములును గండ్లయద్దములును గ్రాపింగులును మూఁతటోపీలును మనము ధరించుచుంటిమికాని మనదోవతులును జీరలును సేలువులును బిళ్ళగోచులును భస్మరుద్రాక్షలును వారు ధరించుటలేదు. వారి తిలకశూన్యలలాటత్వమును మనమే యనుకరించుచుంటిమికాని మన గంధాక్షతలును కుంకుమహరిద్రా చూర్ణములును వారిమొగముల నలంకరించుట లేదు. శుచులమై స్వభాషయో దేశభాషయో మాటలాడవలసిన భోజనాదిసమయములలోఁగూడ హూణమ్లేచ్ఛభాషల మనము మాటలాడుచుంటిమి కాని యనవసరముగా వారు మనభాష మాటలాడుటలేదు. ఇట్టివాని నన్నింటిని విమర్శించు

కొని మనస్థితిగతుల మార్చుకొని మంచిమార్గ మవలంబించుటకు మాఱుగాఁ బైన నంటరానితన మేమిటని యసహ్యపడు బరోడారాజు గారి ననవలసిన దేమియున్నది ?

ఇఁక ఋషితుల్యుఁడగు గాంధిమహాత్ముని మొఱయఁట యాల కించుదము.

" పంచములు, అంటరానివారు, చెప్పరానివారు, పెద్దయింటి వారు, అని పిలువఁబడి నిరాదరింపఁబడుచున్న వారి నిటుల బాధపెట్టుట హిందూమతధర్మములలో నొక్కటియని ధృవపడుటయే ప్రాప్తించె నేని నేను హిందూమతమునకు ప్రబలవిరోధినని బహిరంగముగ చాటు కొనుటకుఁగూడ సంసిద్ధుడనై యున్నాను. కాని నేనింతవరకు హిందూ మత మింతకఠినధర్మముల కాకరమైనదని నమ్ముట కవకాశము కలుగ లేదు "

శ్లో॥ తిష్ఠ న్నమన్ హసన్ జల్పన్ శృణ్వ న్నంత్యజభాషణం । అన్యం స్పృశన్ దిశం పశ్య న్న కదాచి దుపస్పృశేత్॥ కాకశ్వఖర విట్క్రోడతామ్రచూడరజస్వలాం। వ్రాత్యాంత్యపతితాన్ పశ్యం స్తతో నోపస్పృశే ద్బుధః ॥

(నిల్చుండుచును వంగుచును నవ్వుచును మాటలాడుచును నంత్యజభాషణముల వినుచును నితరుని స్పృశించుచును దిక్కులు చూచుచును నొకప్పుడేని యాచమనము చేయఁదగదు. కాకిని కుక్కను గాడిదెను బందిని కోడిని రజస్వలను వ్రాత్యుని నంత్యజుని బతితుని జూచుచు నాచమనము చేయుఁగూడదు.) అని యాచమనాది స్వల్పకర్మ ములయందు సహితము చండాలస్పర్శము తుదకుఁ జండాలభాషితశ్రవ ణముగూడఁ బనికిరాదనుచు గార్దభసూకరాదులతోఁ బోల్చి భరద్వా జాది పూర్వఋషు లిట్లు మొఱపెట్టుచుండఁ బంచములనికాని యంట

—• పుష్కరత్రయ వర్ణనము •—

ఆ॥ అప్రకారముగను హాటకేశ్వరమున మూఁడు పుష్కరములు గూడఁ గలవు,
సకలపాపములకు సంక్షయకరము లాతీర్థములు, మహత్త్వదీప్తములును, ౩౨౦

వ॥ అయ్యవి దృష్టంబులయియో స్పృష్టంబులయియో కీర్తితంబులయియో భాస్కరుం డంధకారంబునుంబోలెఁ బాతకంబుల విలయంబునొందించు, సకలతీర్థంబులును స్నానదానంబులఁ బవిత్రము చేయుఁ గాని పుష్కరతీర్థ దర్శన మాత్రంబుననే యఖిలకలుషంబులును నంతంబునొందు"నని యిట్లు చెప్పుటయు శౌనకాదిమునివర్యులు

సీ॥ "బ్రహ్మదేవుఁడు తానె ప్రథమ మీతీర్థము లున్మూఁడును సృజియించినాఁడటనియుఁ
పౌలస్త్యదిశఁ జంద్రభాగాసరిద్వఁతియు యమదిశఁ గరతోయ హద్దులనియు
నాసరస్వతిదాఁక నామడదూరముం దిన్నగా వ్యాపించి యున్నవనియుఁ
త్రిజగంబులం గూడ దేవతలం దొట్టి యందఱుం గొనియాడుచుందురనియు
వినుచున్నారమే, మీవె వెనుక నవ్వి యాకసంబున వసియించుచునని వచించి,
తేపథంబున మఱి హాటకేశ్వరమున కేగుదెంచెనో వచియింపవే మహాత్మ!" ౩౨౨

వ॥ అని యడుగుటయు సూతుండిట్లనియె, ౩౨౩

కం॥ "భవదుక్తమంతయును వాస్తవ మవనీదేవులార! తజ్జీవనరు
డ్భవునకుఁ బ్రణామ మొనరిచి వివరింతు సకృత్స్నముగను, వినుఁడీ శ్రద్ధన్,

వ॥ అవ్యక్తజన్ముండగు బ్రహ్మ నిజలోకంబున వసించుచునెడ దేవర్షియగు నారదుండు త్రిలోకంబులుం దిరిగివచ్చి తదంఘ్రులకు జోతవెట్టి సన్నిధిం గూర్చుండుటయు నమ్మనినుద్దేశించి యతండు ౩౨౫

—* బ్రహ్మ నారద సంవాదము *—

కం॥ "ఎన్నాళ్ళకో కనఁబడితివి, యన్నా! యిపు డెచటినుండి యరుదెంచితి? నీ
పున్నెపు భూములు తిరిగితో యున్నది యున్నటులఁ జెప్ప మోయికుమారా!"

వ॥ అని ప్రశ్నించుటయు నారదుం డిట్లనియె, ౩౨౭

కం॥ "భూలోకమునుండి విభూ! యాలస్యం బయ్యెనని రయంబున నే నీ
కాళ్ళుఁ గొలువఁగ వచ్చితి, నా లౌల్యము సైఁపవలయు నాతో డింకన్" ౩౨౮

వ॥ అనవుడు వెండియు నంబుజాసనుండు ౩౨౯

కం॥ "తల్లోకవ్యవహారము లల్లన నెఱిఁగింపుమయ్య, యచ్చటి ధరణీ
వల్లభు లెట్టిరో భూసురతల్లజు లెటువంటివారో తనయా! చెపుమా" ౩౩౦

వ॥ అని యడుగుటయుఁ గలహాశనుండు బ్రహ్మ కిట్లనియె, ౩౩౧

తే॥ "కలి ప్రవేశించె మనుజలోకమున దేవ! రాజులెల్లరు లోభపరాయణులయి
సత్పథంబును విడనాడి జనులఁ బట్టి కరము పీడించుచున్నారు కరుణమాలి, ౩౩౨

కం॥ శౌర్యముగనఁబడ, దితరులభార్యల బలిమిని హరింపఁ బాల్పడి రకటా!
యార్యబ్రాహ్మణవిబుధాచార్యులఁ బూజించుటన్న సరిపడ దెడఁదన్, ౩౭౩

సీ॥ వివిధజాతులచేత వేదముల్చదివించి యర్థార్జనము సేయు నల్పమతులు
కడు నీచుఁడేని కాళ్లడిగియిచ్చినదాన నాసక్తిగ్రహియించు నర్థలోభు
లాచారమునువీడి యగుపడినదియెల్లఁ దృప్తిమైమెసవెడి తిండిపోతు
లాల నెద్దులఁ బెంచి వ్యవసాయవృత్తిచే గాదెలనింపు నిష్కారుణచిత్తు
లాచమనమేని చేయని యలసులగుచు భూమిసురు లుండుచున్నారు భూతలమున,
వైశ్యజాతులు మొండటికే వసుధలేరు, పాడు కలి వచ్చుకతమునఁ బ్రకృతి మార్గ!

తే॥ శూద్రులే ధర్మకాములు శోధనిపుడు, శూద్రులే సుతపస్వులుం జూడఁజూడ,
లోకయాత్రాక్రియలనెల్ల లోపములనుజూపి నవ్వెడివారును శూద్రజనులె, ౩౭౫

కం॥ ధనము వయోరూపయుతమగు స్త్రీజనమును నెవ్వానియింట సాందర్యింబుగనం
దునో వానితోనె సఖ్యము పొనరింపుచునుండి రిపుడు భూస్థలి మనుజుల్,

తే॥ బ్రహ్మచారులు విధవలుం బారికాంక్షు లాదిగాఁగలవారికే యధికకామ,
మకట! పైవేషభావమలే యరయఁ గాని నీతిబాహ్యంబు లవ్వారి చేతలెల్ల,

కం॥ పాపాక్రాంతంబయి యిస్సీ! ప్రకృతము తీర్థవితతి చెఱుపంబడెఁ, వా
ణీపతి! యవి కలిభయమున వాపోవుచు దెసలకడలు పట్టఁగవలసెన్, ౩౭౮

సీ॥ స్వల్పనీరములైన జలదము లుఱుచుగా వర్షింపవయ్యె నవ్వసుధలోన,
వృష్టిలోపముచేత వేసినసస్యము ల్పెరుఁగవయ్యెఁ గరంబు విరివిగాను,
సస్యముల్పెరుఁగమిఁ జాల నాహారంబు సురభులు పొలీయఁజూడవయ్యె,
నిచ్చినపాలలో నెంతయు జిగిలేక కొల్లగా నాజ్యంబు వెళ్లదయ్యె,
నీ వొసంగినట్టి హైచ్చైనవరముచేఁ గలి ప్రవిష్టుఁడగుచుఁ గ్రాలుచుండ
మనుజలోకమెల్ల మలమల మాడిపోయెను బితా! యిటేలచొనరిచితివో, ౩౭౯

మ॥ కలికాలంపుమహత్త్వ మేమనుచు వక్కాణింతునీతోడ, యు
గ్మలు లుచ్చాటనవిద్య నేర్చి మిగులన్ గయ్యాళులై భర్తతోఁ
గలహంబాడుచు నందగాండ్ర బటువుం గౌఁగిళ్లలోఁజిక్కి వ
ర్తిలుచుం జేయఁగడంగి రుత్తలము ద్దేవేశ! యాలించితే, ౩౮౦

సీ॥ ఏకుటుంబములోను శోకారవాఘ్యమై పెండ్లాముమగలకుం బెనఁగులాటె,
యేయగారములోను న్యాయావిశిష్టమై తండ్రికొమాళ్ళకుం దగవులాటె,
యేయింటిముందును నీర్ష్యాసమేతలై యత్తయుం గోడలు మొత్తుకొనుటె,
యేవాడయందును నిహిహీయనం బ్రజల్ చుట్టంబు లొండొరు లొట్టుకొనుటె,
యేబజారునఁ గనుగొన్న నింటివారు జీతగాండ్రును జోరికి సిద్ధమగుటె,
యేపురంబునఁజూచిన నేలికలును జోరులును బోరులొనరింపఁ దారసిలుటె! ౩౮౧

తే॥ ఇంతకాలంబునుండి నే నిటకు రాక మెలఁగుటకు హేతు వేమనితలఁచితేవొ,
కలహములఁగంచు మర్త్యలోకమునను౦టి, నెడఁద జిలవుట్టెఁ, గ్రమ్మఱ నడతు నటకె
కం॥ గులగులలెట్టెడిఁగడు నిచ్చలు నన్ను న్మార్గహృదయ చరణంబుల, నా
గులగుల సురనరహరులకుఁ గలహంబులుగలిగినపుడు క్రమముగ నణఁగున్ ” ౩౯౩

—• బ్రహ్మ లోకరసార్థమై భూతలంబునకుఁ గమలమును వదలుట. •—

వ॥ అనియిట్లువాక్రుచ్చుటయుఁ బితామహుండు పుష్కరంబుహొంతెఁ జింతా
వ్యాకులితేంద్రియుండై

ఉ॥ “భూమిని మామకీనమగు పుష్కరతీర్థము తప్ప కేత దు
ద్దామకలిప్రభావమునఁ దా లయమందును గాన దాని నే
దో మఱియొక్కచోటఁ గలియుండమిఁజూచి ప్రవేశపెట్టెదన్,
క్షేమముహొందె నచ్చటికిఁ జేరును దక్కటి యెల్లతీర్థముల్, ౩౯౫
కం॥ కలికాలం బంతయు నిర్మలజలములతోడ నచట మని యాతీర్థ
మ్ములు కలిసనుపైఁ దమతమనిలయమ్ములనుండు మరల నిరపాయముగన్ ” ౩౯౬
వ॥ అని హృదయంబున నిశ్చయించుకొని ధ్యానించి కరగతంబగు కమలమును
విలోకించి ౩౯౭
కం॥ “కలిసొచ్చనట్టి ధాత్రీస్థలమునకుం బోయి పడుమ జలజమ! వేగన్,
లలిఁ బుష్కరతీర్థముఁ దత్స్థలమునకుంజేర్తు నీకు సహవాసముగన్ ” ౩౯౮
వ॥ అనిచెప్పిపంపుటయు నయ్యది మహీతలంబెల్లఁ గ్రుమ్మఱి ౩౯౯
సీ॥ నిరశనవ్రత మెచ్చునియతిపైఁ బూనియు దినమున కొకపూటఁదినియు మఱియు
రెణ్ణాళ్ళకొకసారి యన్నంబు మెసవియు మూణ్ణాళ్ళకొకమాఱు భోక్తలయియుఁ
గృచ్ఛ్రచాంద్రాయణకృచ్ఛ్రంబులూనియుఁ బారాకసువ్రతభాక్కులయియు
మాసోపవాసముల్ చేసియు నశ్మకుట్టకులయ్యుఁ బర్ణభక్షకతమనియుఁ
బండ్లుదినియు భయముపడక దంతోలూఖలులయియును ద్విజేంద్రు లలఘుతపము
నాచరించుచున్న యాహాటకేశ్వరక్షేత్రసవిధమునకుఁ జేరఁబోయి ౪౦౦
సీ॥ పావన భూదేవపాపఠ్యమానమై మేటికుగ్గిత్వను ల్మిన్నుముట్టఁ
దత్త్వవిత్సందోహతంతన్యమానమై శాస్త్రార్థపారము ల్పందడింప
శ్రౌతానలత్రయజాజ్వల్యమానమై క్రతుభూమి సంప్రీతిగలుగఁజేయ
దేవాధ్వపర్యంతదేదీప్యమానమై బహుళయూపస్తంభపంక్తి యొప్పఁ
బావనంబని యొకచోటఁబడియు లేచి మఱియునొకచోటఁబడి వడి మగుడలేచి
యింకనొకచోటఁబడియె మునీంద్రులార! పడినకడనెల్ల గుంటలై పరిఢవిల్ల, ౪౦౧

వ॥ ఆకుంటులమూఁడింటను స్ఫటికసన్నిభంబును స్వచ్ఛంబును నగు జలం
బూఱుటయు జలజాసనుండు స్వయంబుగంజనుదెంచి వేదవేదాంగపారగులగు వివిధ
విప్రులచే వేష్టితంబును వ్రతచర్యాపరాయణులగు ననేకతపస్వులచే నాక్రాంతంబును
నగు హాటకేశ్వరక్షేత్ర మంతటం గలయ నవలోకించి ౪౦౨

తే॥ "అహాహా! యీక్షేత్ర మెంతరమ్యము కనంగ, బ్రాహ్మణప్రియ మత్యంతపావనంబు
గాన విప్రజనాశ్రయంబైనయిచట యజ్ఞ మొకటి యథావిధి నాచరింతు, ౪౦౩

కం॥ ఆ పుష్కరముల మూఁడిటి నీపురికిందెచ్చి వాని నీగోతులలో
నాపూరితముల్సేసెదఁ బాపపుఁ గలిదోష మెల్లఁ బాసెడిరీతిన్" ౪౦౪

వ॥ అనినిశ్చయించుకొని ధరాతలంబునఁ గూరుచుండి తడవు ధ్యానించి జ్యేష్ఠ
మధ్య కనిష్ఠపుష్కరంబుల మూఁడింటిని రావించి సంతసంబు వెలిపుచ్చుచు ౪౦౫

శా॥ "ఏతత్పుష్కరనామతీర్థములు మూఁ డిచ్చోటికిన్ నేను సం
ప్రీతిం గైకొనివచ్చినాఁడఁ గలిదోషఘ్నంబుగా, వీనుల్వచ్చి సు
స్నాతుల్గానిటు శ్రద్ధతోడ నెపుడున్ నాశంబులేకుండ వి
ఖ్యాతంబైతగు సిద్ధిఁబొందుదురు మత్కారుణ్యమేపారఁగన్, ౪౦౬

తే॥ ఎవరు కార్తికపూర్ణిమ నిచట శ్రాద్ధమాచరింత్రో సమాహితులగుచువచ్చి
యుల గయాశీర్షమందున నాచరించు శ్రాద్ధపుం బుణ్యమును వారు సంతరింత్రు,

కం॥ ఆ౦ దాద్యంబగుపుష్కరమందునఁ గార్తికిని గృతము యజ్ఞము నాచే,
నందొనరుచు స్నానాదులఁ బొందుదురు శతాధికంపుఁ బుణ్యము మనుజుల్, ౪౦౭

కం॥ వైశాఖపూర్ణిమాతిథి నే శాస్త్రోక్తప్రకార మిఁక రెండవదౌ
నీశుభపుష్కరమునఁ గలినాశమునకుఁ జేసెదను ఘనంబుగఁ గ్రతువుల్" ౪౦౮

—♦ బ్రహ్మ యజ్ఞార్థ ముపకరణంబులం గూర్చుట. ♦—

వ॥ అని వాయుదేవు దక్కొమొగంబై ౪౧౦

సీ॥ "తిమిరహృద్ద్వాదశాదిత్యులతోడను శోభిల్లు నష్టవసువులతోడ
రౌద్రమూర్తులయిన రుద్రులతోడను విమలులైన మరుద్గణములతోడఁ
దౌర్యత్రికాఢ్య గంధర్వులతోడను సుకృతులౌ లోకపాలకులతోడ
విద్వద్వరేణ్యులౌ విద్యాధరులతోడ సంసిద్ధులౌ సిద్ధచయముతోడ
ద్రుతముగా బిడౌజుఁ దోడ్కొనిరమ్ము పొమ్మనిల! యస్మదాజ్ఞ యవధరించి
యారభిష్యమాణ యజ్ఞకర్మంబున బాసటయి వసింపవలయుఁగాన" ౪౧౧

వ॥ అని యానతిచ్చుటయు నతండు హరిహయు నగారంబునకరిగి యంతయు
నివేదింప నాయన సర్వగీర్వాణ గణంబులతోడం జనుదెంచి చతుర్ముఖునకు సాష్టాంగ
మెఱఁగి యేమియాజ్ఞయను నడిగించిట్లనియె, ౪౧౨

కం॥ "నేను గలికాలభయమునఁ బూనికి సఫలంబుగాఁగఁ బుష్కరములయూఁ
దానీతంబులు సేసితి, మానుగ వైశాఖి మూఁడు మఖములొనరుచ్, ౪౧౩

ఆ॥ తన్నిమిత్తముగ శతక్రతూ! సంభారములను సిద్ధపఱచవలయుం నీవు,
పిలువఁబంపు వేదవేదాంగపారగులయి తేజస్వులైన యవనిసురుల" ౪౧౪

వ॥ అని యిట్లు పలవోసంగుటయు శతమఖుండు సవినయంబుగా వల్లెయని సత్వరంబ సంభారంబు లన్నిటిం దెప్పించి యశస్వులగు నవనీసురులరావించె, నంత నంబుజాసనుండు యథాశాస్త్రంబుగను సద్దక్షిణంబుగను యజ్ఞంబులాచరించె" నని యిట్లు వాక్రుచ్చుటయు ఋషులిట్లనిరి, ౪౧౫

యజ్ఞ ప్రారంభము

తే॥ "సూత! యాక్షేత్రమందున ధాతచేతఁ గ్రతువుకృతమయ్యెననియెది కీర్తితంబొ
యది మహాద్భుతమొదవించె, నధ్వరముల నాతఁడేకద యష్టవ్యుఁ డరసిచూడ,

కం॥ యష్టవ్యుఁడైన యేతత్స్రష్టయె యజమానుఁడగుచు జన్నమొనర్పన్
విష్టపముల నాయకుఁడిక యష్టవ్యుఁ డెవండొ చెపుమ యనఘా! మాకున్, ౪౧౬

సీ॥ ఎవరు ఋత్విజులైరి యీయనప్రత్యక్షమం దధ్వరక్రియ లాచరింప?
నాయగ్రజన్ముల కంబుజాసనుఁడు తా నెయ్యది దక్షిణయిచ్చినాఁడు?
యజ్ఞముం జేయింప నధ్వర్యుఁడెవ్వరు? హోతృత్వ మెవ్వరి కొసఁగఁబడియె?
నెవ్వఁ డాగ్నీధ్రుండు? నెవ్వాఁడు బ్రహ్మగా సంస్థితుండయ్యెఁ దత్సదమునందు?
నెవ్వ రుద్గాత? యాచార్యుఁ డెవ్వరచట? నబ్బురముగల్గఁజేయు నీ యజ్ఞగాథ
యంతయు సవిస్తరమ్ముగా నానతిమ్ము, వినఁ గుతూహలమయ్యెడి మనమునందు"

వ॥ అని యిట్లు ప్రశ్నించుటయు సూతుండు ౪౧౯

ఆ॥ "నేను మీకుఁగాను నిఖిలమౌ యజ్ఞీయవార్త దెలియఁబఱతు వరుస వినుఁడు,
ఎవరొ తత్సదస్యు లెవ్వరో ఋత్విక్కు లేది దక్షిణార్థ మీయఁబడెనో, ౪౨౦

వ॥ అవ్విధంబున యజ్ఞకాముండగు నతనిపాలికి నమరనాథుండును నష్టమూర్తియు నఖిలామర్త్యగణసహితంబుగా నరుగుదెంచుటయు మర్త్యధర్మసమాశ్రితులగు వారి విలోకించి వారిజాసనుండు వినయోపేతంబుగం గృతాంజలిపుటుండై ౪౨౧

ఉ॥ "స్వాగతమయ్యె మీకు సురసత్తములార! యనుగ్రహింపుఁడీ
బాగగు నాసనంబులకుఁ బై నుపవిష్టులుకండు చక్కగా,
యాగములందు మంత్రిమమహత్తను గష్టముగానువచ్చు మీ
రాగతులైనవారలు స్వయంబుగ, ధన్యుఁడనైతి నేనికన్" ౪౨౨

వ॥ అని పలుకుటయు దేవత లిట్లనిరి, ౪౨౩

కం॥ "భవదీయాధ్వరమునఁ గ్రియ కెవ రేమియొనర్పవలెనొ యి మ్మానతి, గీ
ర్ధవ! తద్వ్యాఖ్యార్థ్యంబును సవిశేషముగా వచింపు, శ్రవణింతు మొగిన్" ౪౨౪
వ॥ అని యిట్లు వచించుటయు వెండియు బ్రహ్మదేవుండు ౪౨౫
ఆ॥ "విశ్వకర్మ! నీవు వేవేగఁ జని యజ్ఞమంటపము రచింపు మంజులముగ,
యజ్ఞవేదికలును వహ్ని పత్నీశాల యమరుపుము మనోజ్ఞమై రహింప, ౪౨౬
సీ॥ ఎటనెద్ది విహితంబొ యటనద్ది యుండంగఁ బృఘుకుండము ల్దీరిపింపుమయ్య,
గ్రహములు చమసము ల్సహిత మేమఱకుండఁ బాత్రలన్నియు సిద్ధపఱచుమయ్య,
కాష్ఠమయంబైన కడియముల్దగిలించి యూపము ల్సేయించి యుంచుమయ్య,
పాత్రలుంచుట కర్హభంగిగాఁ గుదిరించి పాయలు త్రవ్వింపఁగఁ బూనుమయ్య,
చయనములకయి పదివేలు బయి శతాష్టకంబు నిటికెలఁ గాల్పింపఁ గడఁగుమయ్య,
వరహిరణ్మయపురుషు నొక్కని రచించి తెచ్చియిమ్మయ్య నీవొయ్య దేవశిల్పి!
సీ॥ సురగురూ! పదియాఱుగురు ఋత్విజుల నీవ యార్జింపు, మన్యుల కది యశక్య,
మమరనాయక! ప్రాంతులైవచ్చు ద్విజుల కీ వంగమర్దనసేయు మధికభక్తి,
నరవాహనా! దక్షిణల నిచ్చుపని నీది తిలకించి యొప్పెడ్డిదేయమగునొ,
హరి! నీవు బాగోగులరయుచుండుము సదా క్రియమాణమహా ప్రతికృత్యమునకు,
లోకపాలురార! మీరు సురత్న్యముల్ దెసలు భూతవితతి తిరుగకుండ,
నెవరి కెద్దిప్రియంబొ యెఱిఁగి యజ్ఞేశ్వరా! యొసఁగుచుండు ధనమొ వసనములనొ
క॥ వసురుద్రాదిత్యమరుద్వసరంబులతోడఁ గూడి విశ్వేదేవుల్!
మెసవఁ జనుదెంచు జనులకు విసువక వడ్డించి తృప్తిపెట్టుఁడు మీరల్" ౪౨౯
వ॥ అని యాదేశించుచుండ ససంభ్రమంబుగా విశ్వకర్మ చనుదెంచి ౪౩౦
ఆ॥ "సవనమంటపంబు సంసిద్ధమైనది యంచతేజి నెక్కియాడు రౌత!
యన్యభవనుదీరితాఖిలపరికరమ్ములును సిద్ధమయ్యె లలితముగను" ౪౩౧
వ॥ అనిచెప్పుచుండ బృహస్పతి యరుగుదెంచి ౪౩౨
కం॥ "దేవా! పదియార్గురు భూదేవతలను దోడితెచ్చితిని, వారలదౌ
ప్రావీణ్యంబుఁ బరీక్షం గావించి వరింపు యజ్ఞకర్మంబునకున్" ౪౩౩
వ॥ అనిపలుకుటయు బ్రహ్మ స్వయంబుగా వారిం బరీక్షించి ఋత్విక్త్వంబున
నియోగించి యర్హణంబు గావించె" నని వక్కాణించుటయు ఋషులిట్లనిరి. ౪౩౪
ఆ॥ "ఎవరి కేమి కార్య మేర్పాటుచేసెనో యాసరోజయోని యధ్వరమున
వారివాని పేళ్ళు వరుసగాఁ గీర్తింపు రోమహర్షణీ! కరంబు ప్రేమ" ౪౩౫
వ॥ అని ప్రశ్నించుటయు వెండియు సూతుండు ౪౩౬
సీ॥ "భృగునకు హోత్రంబుఁ బ్రీతి గావిస్తుత్వము గాలవాహ్వయమునికి నొసఁగె,
మైత్రావరుణసంజ్ఞ మతిఁ జ్యవనుం జేసె, నలి పెనచ్ఛావాకు లలి మరీచి,

నధ్వర్యుఁగావించె నల పులస్త్యమునీంద్రు, నత్రిఁ బ్రస్తోతగా నాచరించె,
నొనరించె నున్నేత నోజ సనాతను, రహినుంచె నేష్టగా రైభ్యముని,
బ్రాహ్మణాచ్ఛంసి గర్గుండు, బ్రహ్మ నారదుఁడు,భరద్వాజుఁ డాగ్నీధ్రుఁ,డదఁగ నేల
మనపరాశరసూనుండె మానులార! తాతయజ్ఞంబునం దాను హోతయయ్యె, ౪౩౭
సీ॥ జడదారులార! శాండిల్యుఁడు దాఁ బ్రతిహర్తయచట, సుద్గాతృత్వం
బిడె గోభిలాఖ్యముని, కాతఁడు సామమునందుఁ జాల దక్షుం డరయన్, ౪౩౮
ఆ॥ కౌథుమాభిధానఘనుఁడు దాఁ బ్రస్తోత యబ్జభవుఁడుజరుపు నధ్వరమున,
నంగిర స్తపస్వి యచట సుబ్రహ్మణ్యుఁడైనవాఁడు పుణ్యమానులార! ౪౩౯
వ॥ యజ్ఞసిద్ధిపొంటె నాఋత్విజులఁ జతుర్ముఖుండు సవినయంబుగా వస్త్రా
భరణశోభితులం గావించి గృహోక్తవిధానంబునం బూజించి ౪౪౦
తే॥ "ధరణిసురులార! వీఁడు ఘోశరమ్ముఁజొచ్చుచున్నవాఁడు ప్రసాదింపుఁ డూర్జితముగ
యజ్ఞదీక్షం బ్రవేశింప నాజ్ఞయిచ్చి వెసఁ గృతార్థునిజేయుఁడీ వేడుకొందు" ౪౪౧

—♦ బ్రహ్మ నాగర బ్రాహ్మణులకు వరమిచ్చుట ♦—

వ॥ అనియిట్లు దీక్షారంభంబుఁ జేయనుండుటయు నాగరబ్రాహ్మణులెల్లరును
గర్తాతీర్థసముద్భవుండగుమధ్యగుం బిలిచి ౪౪౨
శా॥ "ఓరీమధ్యగ! నీవుపోయి ద్విజకృత్యచ్ఛిద్రదుర్నీతియౌ
నా రాజీవభవున్ గుతించి చెపు మీవ్యాహార, మహ్యుద్భవం
బారంభంబు సుపూరితంబయినపై వర్జించి యీ క్షేత్రమున్
గౌరీనాథుఁడు మాదుపూర్వికులకుంగా నిచ్చెఁ బూర్వంబునన్,
తే॥ నూటయైదుగురబ్జజు ల్నేటికైరి యరయ నిది మాకుఁ గైవసమైనదాది,
ధిక్కరించియొబుంగ రం దొక్కరేని నినువినా మమ్ము నోక్రూర! నీతిదూర!
తే॥ నాగరద్విజులకు వెలిగాఁగ నిచట యజ్ఞయాగములంజేయునతఁడు వధ్యుఁ,
డంటువలనిఫలం బాతఁ డొందఁజాలఁ, డిటుల నీ క్షేత్రమిచ్చువాఁడె యీశుఁడనియె,
తే॥ కాన నిటుజన్నమొనరింపఁబూనెదేని నాగరులఁబిల్చి కావింపు బాగుగాను,
లేనిచో యజ్ఞఫలమును లేశమేని పడయఁజాలవు ధర వారు బ్రదికియుండ" ౪౪౬
వ॥ అని వారుచెప్పుటయు నమ్మధ్యగుండు యజ్ఞమంటపమ్మునకు దూరమ్ముగా
బ్రాహ్మణపరివారితుండైయున్న బ్రహ్మపాలికింజని నాగరోక్తంబు వక్కాణింప
మానుషభావవిశిష్టుఁడైన యన్నలువ సాంత్వపూర్వకంబుగా నతని కిట్లనియె, ౪౪౭
తే॥ "మధ్యగా! నీవునొడివినమాట నిజమె కాని యిటుచేయవలెనన్న కాంతుఁగాక
పొరపడి వరించినాఁడను బూర్వ మఖిలఋత్విజులఁ గాన నేనింక నేమిసేతు,

కం॥ కావున నీస్థానమునకు రావింపుము పోయి నాగరబ్రాహ్మణులన్,
నే వారి సెలవుగైకొని పోవుదు మఖమంటపమ్ముపొంతకు వేగన్" ౪౪౯

వ॥ అనవుడు మధ్యగుఁడు ౪౫౦

తే॥ "శివు దేవత్వమంతయునీడి యిపుడు మనుజభావముం బొందియున్నాఁడ వోవిధాత!
యట్టి సామాన్యుఁడైన నీయంతికమున కేగతిం దద్విజాగ్రిణు లాగ్రిఁగలారు?

కం॥ ఆవులు పశువులలోపల నేవిధమున శ్రేష్ఠ్యమును వహించెనొ జగమం
దావిధమున నాగరులకు క్ష్మావిబుధసమూహమందు శ్రేష్ఠ్యముగలిగెన్, ౪౫౨

ఆ॥ అట్లు గాన నీవు యజ్ఞసంప్రాప్తికై చిత్తమందు వాంఛ సేయుదేని
రాణ వెలయు నాగరబ్రాహ్మణులయనుగ్రహము వడయుమెమ్మె కమలజన్మ!"

వ॥ అనినవిని ధాత భీతుండై ఋత్విక్సహితంబుగాఁ దత్కల్పితనాగర బ్రాహ్మణ
సన్నిధానంబున కరిగి సవినయంబుగా సాష్టాంగపడి కరములు జోడించి ౪౫౪

శా॥ "ఏతత్క్షేత్రమునందు మీరు వెలిగా నేకర్మమున్ జేసినన్
ఖ్యాతిం జెందక వ్యర్థమౌట మదికిన్ జ్ఞాతంబె, కానీ సమా
నీతం బిందుఁ ద్రిపుష్కరంబు, లభియే నిక్షేపమూల్గాను సం
ప్రీతిం గైకొని స్వీయతీర్థములుగం బ్రేమింపుఁడీ నాగరుల్! ౪౫౫

శా॥ మీ యాధిక్యమెఱుంగ కర్త్విజులు సంప్రీతిన్ సురాచార్యచే
నేయానీతులు, గాన నైఁచి క్రతువున్ వీరే సమాసీనులై
చేయింపన్ సెలవిండు, గండు, కలిసంసిద్ధించిన స్వేనియున్
నా యీ తీర్థము త్వత్ప్రతాపములఁ జెందాడన్ సమర్థంబగున్" ౪౫౬

వ॥ అని ప్రార్థించుటయును నాగరబ్రాహ్మణు లిట్లనిరి, ౪౫౭

కం॥ "నాగరులకు బాహ్యముగా నేగతి మఖ మీవు సేసెదేని క్రమముగా
సాగింతురు సెరసురలును, బాగుగఁ గావింత్రు భూమిపాలురుగూడన్, ౪౫౮

తే॥ విన నగుఁగాక నేనిది యాచరింపకుండ నుండనటంచని మొండిసలిపి
మమ్ములం జిన్నపుచ్చక మానవేని తరలు మాయొద్దనుండి యోతత్త్వణంబ" ౪౫౯

వ॥ నావుడుఁ జతురాననుండిట్లనియె, ౪౬౦

ఆ॥ "ఏతదాదిగాఁగ నిచ్చోట నాగరబ్రాహ్మణాగ్రణులకు బాహ్యముగను
శ్రాద్ధమో మఖంబో సలుపుచో సరి వృథాయగును గాని ప్రాప్య మటు హుళక్కి,

కం॥ నాగరు లీక్షేత్రము బాగుగ లేదనుచు నెటకొ పనివిని శ్రద్ధన్
యాగాదులు కావించినఁ గాఁగల సయ్యవియు వ్యర్థ కార్యము లింకన్, ౪౬౨

తే॥ ఇట్లు మర్యాదచేసితి నేనుగానఁ గరుణయుంచి మదీయయజ్ఞమున కాజ్ఞ
యిండు భూదైవతములార! యిపుడపోయి సక్రమంబుగ దాని నుపక్రమింతు,

౭ నారాయణరావుగారు, దాతారుపల్లి

౮ బేలూరి రామన్న గుప్తగారు, సదాశివుని పేట

౯ రామచూరి బండేరావుగారు, అయినాపురం.

౧౦ రాచూరి సుబ్బయ్యగారు - శ్రీ శ్రీ వితూపాతుసంస్థాన ప్రిధానమంత్రి

౧౧ ఘంటంభట్లగారి వెంకటభుజంగముగారు - ముసలాపురం

౧౨ దండు గుండేరావుగారు, కరణము - ముసలాపురం

౧౩ లిగుళ్ళ కృష్ణారెడ్డిగారు. పటేలు - ముసలాపురం

౧౪ కాకుమాను హనుమయ్యగారు, నర్సారావుపేట

౧౫ తిప్పరాజు కామేశ్వరరావుగారు, కరణం, దుగ్గిరాల

౧౬ భాస్కరరాయుని వెంకట రామయ్యగారు, వంగపల్లి

౧౭ నరసింహాస్వామివారు, యాదగిరి

౧౮ బీరకాయల హనుమంతరావుగారు, రాయగిరి

౧౯ జూలూరి వెంకటరత్నముగారు, వకీలు, గుంటూరు

౨౦ మెదక్ కిషన్ రావు దేశముఖుగారు, నల్లపల్లి

౨౧ జానపాటి సుబ్రహ్మణ్యంగారు, పాపయపాలెము

౨౨ చిక్కరాజు మట్టపల్లి రావుగారు, కరణం, చెలకుర్తి

౨౩ కవులూరి నరసింహారావుగారు, ఈలపోలు

౨౪ గోటేటి వేణుగోపాలరావుగారు, పోలీసుసబిన స్పెక్టరు, ప్రత్తిపాడు

౨౫ నడింపల్లి నరశింహారావుగారు, రిజెస్ట్రరాఫీసు క్లార్కు, క్రోసూరు

౨౬ రాచకొండ వెంకటరామయ్యగారు,రొనమదల

౨౭ కప్పగంతు సుబ్బారావుగారు - పోలీసుసబిన స్పెక్టరు - పిడుగురాళ్ళ

౨౮ మండ చినవెంకయ్యగారు, దండమూడి.

౨౯ శ్యామాపంతులగోపాలరావుగారు - వరంగల్లు

౩౦ కన్నయ్యగారిసంగయ్యగారు-ముసలాపురం

౩౧ చక్కిలం పాపయ్యగారు-ముసలాపురం

౩౨ తాళవెలిమె లింగన్న మొకద్దంగారు-గడిపెద్దాపురం

౩౩ కిషన్ రావు దేశపాండ్యాగారు- తాళ్లపల్లి

౩౪ తొర్లకొండ లక్ష్మారెడ్డిగారు, క్షీరసాగరం.

౩౫ రంగరాజు గోపాలకిషన్ రావు దేశముఖుగారు, పాపురం

౩౬ చివుకుల శ్రీరామశర్మగారు- నాగులుప్పలపాడు

౩౭ గజవాడ వెంకటాచార్యులుగారు, అల్లాదుర్గము

౩౮ కాకిరాల రామచంద్రయ్యగారు, మముదాపురము

౩౯ లక్ష్మీనారాయణ గాడు సెట్టిగారు, అందోలు

# అభినవసరస్వతి

సంపాదకుఁడు - నాగరఖండస్వర్ణకారవ్యవహారాది బహుగ్రంథకర్తయగు
జానపాటి పట్టాభిరామశాస్త్రి.

ఇది, లౌకికమాసపత్రిక. ఇందు వర్ణాశ్రమధర్మబోధక గ్రంథములును విమర్శనము లును వ్యాసములును ప్రకటింపఁబడును. చందా సం॥ 1 కి రు 3—0—0

ఈ కార్యస్థానమున వెలకుదొరకు పుస్తకములు.

| | | | | | |
|---|---|---|---|---|---|
| 1 | కరిణీశోద్ధారిణి [పూఁరె వీరభద్రకవి] | ... | 0 | 4 | 0 |
| 2 | వాసంతికాపరిణయ నాటకము | ... | 0 | 4 | 0 |
| 3 | కంసవధ నాటకము | ... | 0 | 8 | 0 |
| 4 | చమత్కారమంజరి (సింహాద్రి వెంకటాచార్యులు) | | 0 | 4 | 0 |
| 5 | విరూపాక్షపీఠగురుపరంపర | ... | 0 | 2 | 0 |
| 6 | నీతిగీతలు (సుమతిశతకమునకు సంస్కృతము) | ... | 0 | 2 | 0 |
| 7 | విశ్వబ్రాహ్మణశబ్దఖండనము, బ్రాహ్మణశబ్దవిచారము | | 0 | 2 | 0 |
| 8 | విగ్రహారాధన ఖండనఖండనము | ... | 0 | 4 | 0 |
| 9 | చిత్తూరుజిల్లాతీర్పు విమర్శనము (పత్రికాధిపతి) | ... | 0 | 4 | 0 |
| 10 | సంగదోషము | ... | 0 | 3 | 0 |
| 11 | అస్పృశ్యతానివారణ ఖండనము(మల్లాది రామకృష్ణచయనులుగారు) | | 0 | 8 | 0 |
| 12 | వత్సలనీతిశతకము | ... | 0 | 1 | 0 |
| 13 | శివానందలహరి (తంగెడ రామకృష్ణకవి) | ... | 0 | 4 | 0 |
| 14 | నర్సారావుపేట శతావధానము (తిరుపతివెంకటీయము) | | 0 | 3 | 0 |
| 15 | పశ్యాంపుశ్యాం | ... | 0 | 2 | 0 |
| 16 | పశ్యశబ్దవిచారము | ... | 0 | 2 | 0 |
| 17 | పురశ్చరణము | ... | 0 | 2 | 0 |
| 18 | శంతనురాజచరిత్ర | ... | 0 | 14 | 0 |
| 19 | వర్ణవ్యవస్థ | ... | 0 | 4 | 0 |
| 20 | స్వర్ణకారవ్యవహారము | ... | 1 | 8 | 0 |
| 21 | శుద్ధాంధ్రహరిశ్చంద్ర చరిత్రము | ... | 0 | 10 | 0 |
| 22 | అభినవశాకుంతల నాటకము | ... | 0 | 8 | 0 |
| 23 | సూతసంహిత-ఆంధ్రము | ... | 2 | 0 | 0 |
| 24 | స్కాందమహాపురాణాంతర్గతనాగరఖండము ( ౧ సంపుటము ) | | 1 | 0 | 0 |
| 25 | డిటో నాగరఖండము (౨ సంపుటము) | | 1 | 8 | 0 |
| 26 | భారతీయప్రబోధము (పిసుపాటి చిదంబరశాస్త్రి) | | 0 | 4 | 0 |
| 27 | ధర్మనిర్ణయము. | | 0 | 4 | 0 |

అభినవసరస్వతీ కార్యస్థానము, జానపాడు, పిడుగురాళ్ళపోస్టు,
గుంటూరుజిల్లా.